మల్లనారాధ్య, ముదిగొండ

విషూచికారోగశమని

హైదరాబాద్, 1895

Record no. 329

Mallanārāthya, Mudigoṇḍa

Viṣūcikārōgaśamani

Haidarābād, 1895

Record no. 329

## SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

### Bibliographic Record Target

మల్లనారాధ్య, ముదిగొండ.

విషూచికారోగశమని / ముదిగొండ మల్లనారాధ్యనిచే రచియింపఁబడినది.- దఖ్ఖన్ హైదరాబాద్ : పంచాక్షరీముద్రాక్షరశాల, 1895.

20, (1) p. ;20 cm.

Record no. 329

Mallanārāthya, Mudigoṇḍa.

Viṣūcikārōgaśamani / Mudigoṇḍa Mallanārāthyanicē raciyimpam̐baḍinadi.- Dakhkhan Haidarābād : Pañcākṣarīmudrākṣaraśāla, 1895.

20, (1) p. ;20 cm.

Record no. 329

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB Date filming began:




శ్రీరస్తు -

ఓం శ్రీ దక్షిణామూర్తయేనమః-

శ్రీమదఖిలభూమండల మండనాయమానుల
గు, వైద్యవిద్యాపారీణులచే లోకహితార్థ
ముగనుండునటుల రచియింపంబడిన.

యూనానీ, డాక్టరీ, సంస్కృత వైద్యగ్రంథ
ములను జక్కగ బరిశీలించి-
సర్వజనులకు గ్రాహ్యముగునటుల సులభశైలితో
వైద్యకలావిశారదుండగు
ముదిగొండ మల్లనారాధ్యునిచే-

# విషూచికా రోగశమని.

యను గ్రంథము, రచియింపంబడి.
స్వకీయపంచాక్షరీముద్రాక్షరశాలయందు
ముద్రింపబడెను

దక్షిన్ హైదరాబాద్. చౌట్లమహారాజుగంజు.

వె ౮ అణాలు

౧౯౨౪ సం॥ జూన్ నెల ౧ తేది

ప్రథమకూర్పు 3000 వేలు

శ్రీ

శ్రీదక్షిణామూర్తయేనమః,

# విషూచికారోగశమని.



శ్లో॥ న తాం పరిమితాహారాం లభంతే విదితాగమాః ।
మూఢాస్తామజితాత్మానో లభంతే శనలోలుపాః ॥

తా॥ పరిమాణపూర్వకముగభుజించువారలు, సద్వైద్యులు చెప్పినరీతుగసంచరించెడువారలు. వీరలకువిషూచీజాడ్యము (అనగా మహామారీఉపద్రవము) నెప్పటికిసంభవించకుండు. అయినను జ్ఞానహీనులకు మరియు, అధికభోజనాసక్తులకు, వీరలకు ఈవిషూచికోపద్రవము సంభవించుచుండును. కాబట్టి మనుజులయినవారలకు భుజించదగినవిధులేవియనగా అతిసారాదిరోగములుబుట్టకుండునట్లును- మరియు- కష్టతరముగా గర్భమందుభుజించినయన్నము జీర్ణించునట్లును- అధికముగ ఆకలిగలిగియుండునట్లుగను- ఇట్టివంటిక్రియములనువాదిలిపెట్టవలయును. ఏలనగా, తృప్తుగ లిగియున్నప్రముభుజించనియెడల అనేకవ్యాధులతోకూడుకొనివిషూచికారోగమునుబుట్టించును. మరియుతినబడుపదార్థములు తేలికగ నుండవలయును. అతికఠినములుగ నుండగూడదు. మరియు- వాతే

కారిన పదార్థములుగ నుండకూడదు. మరియు, ప్రాతఃకాలమందు రెండుఘామములకు క్షీరయుక్తములుగ అన్నము భుజించవలె యును మరియు, భోజనమును జీర్ణకారిపదార్థములతో మితముగ భుజించవలయును. మరియు-వర్షఋతువునందు కందిపప్పు తోదినవలయును. కీరాదోసకాయలు- గుమ్మడికాయలు- ఈమొదలయిన సరిదీపదార్థములను బుచ్చుకొనకూడదు. ఏలననగా సరిదీపదార్థములను విశేషముగబుచ్చుకునిన అజీర్ణముసంభవించి విషూచీజాడ్యమును కలుగజేయును ఈతీరుగానే ఆకుకూరలుమొదలయినవాటిని విశేషముగ బుచ్చుకొనకూడదు అయినను కాకరకాయలనుబుచ్చుకునిన హానికారకముగనుండదు- దానిమ్మఫలములను ద్రాక్షఫలములను వీటిని దినిన గుణదాయకములుగనుండును మామిడిఫలమును భుజించినగుణకారిగనుండును- అయినను నధికముగ దినగూడదు. మరియు, ముగ్గిపోయిన ఫలములను భుజించకూడదు మరియు, కొద్దిగ పులుపుతో గూడిమధురముగనుండు, ఫలములను బుచ్చుకునిన గుణకారిగనుండును. పెరుగును విశేషముగ బుచ్చుకొనకూడదు భుజించినప్పుడు మిరపకాయలు. మిరియాలు, పుదీన, శుంఠి, అల్లము, చింతపండు- లేక పుల్లనిపదార్థములు, ఇవిఅధికోపయోగములుగనుండు. పుదీనా దొరకకుండినప్పుడు ఎండబెట్టిన పుదీననునుపయోగించుకొనవలయును, మరియు-నేను క్రిందజెప్పబోయెడు చూర్ణమును భోజనమయినపిమ్మటనయినను లేక గురుత్వముగనుండినప్పుడయినను- లేక వాతముజేసినప్పుడయినను- తగుమాత్రము బుచ్చుకునినగుణకారిగనుండును- మరియు నీ చూర్ణము ప్రతిఋతువునందుబహూపయోగముగనుండును.



## యోగము

ఎండిన పుదీనాపత్రములు ౨ తు, మిరియాలు ౫ మాసములు. సౌవర్చలవణము ౧ తు, చింతపండు ౧ తు, వీటినిచక్కగ దంచి పూటకు ౬ మాసములచొప్పున బుచ్చుకునిన అజీర్ణరోగముశమించును. మరియు, ఈయోగము గత్తరసంభవించినదినములలోబుచ్చుకునిన చాలాయుపయోగముగనుండును మరియు- నిమ్మకాయరసరబతునుకొద్దిగఉదకములోచేర్చుకుని బుచ్చుకునినచాలాగుణకారిగానుండును-మరియు పయినజెప్పినరీతుగ గులాబీపుష్పముల అరుకునయినను, లేక పుదీనాఅరుకనయినను వీటిలోనేనినయినను, నొకదానిని కొద్దిగనీళ్ళలోజేర్చి శర్కరయుక్తముగబుచ్చుకునిన మారీఉపద్రవముశమించును. ...

## విషూచీజాడ్యమందు సంభవించెడు విరేచనములయొక్క విశేషవర్ణనము.

ఏదివసములలో విశేషముగ గత్తరజాడ్యము సంభవించునో యాదివసములలో వాయువునందువిషము జేరుకుని యుండును. కాబట్టి దీనిస్పర్శ చేమనుజులకు కొద్దిగను, నధికముగను, విషూచీజాడ్యముసంభవించి మృతినిగలుగజేయును. లేక, భేదులజాడ్యము సంభవించుచుండును. ఈరీతిగసంభవించెడు విరేచనములు గత్తరజాడ్యములోసంభవించెడు విరేచనములు, ఈరెంటిలో భేదముగలిగియుండును. మరియు- నేనుముందు వ్రాయబోయెడువిచారమును జూచినప్పుడు సామాన్యముగసంభవించెడు విరేచనములవిచారము

విషూచి యందు సంభవించెడు విరేచనముల విచారము ఇవివరకే గబోధపడును. ...

యేలననగా విషూచీజాడ్యమందు సంభవించిన విరేచనములు తెల్లగను బియ్యము గడిగిననీటివలెను, లేక గంజివలెను రూపములు గలిగియుండు. మరియు నొకానొకప్పుడు కొద్దిగ పచ్చని వర్ణము గలిగియుండును. మరియు, ఇటువంటివ్యాధి సంభవించగానే యెంతమాత్రము ఆలస్యము జాయక చికిత్సలను జేయవలయు, యేలననగా విరేచనములు సంభవించిన తక్షణమే చికిత్సను జేయనియెడల వ్యాధివృద్ధి జెంది మరణమును గలుగ జేసును. ఇట్లు అనేకులు మృతిని జెందియున్నారు. కాబట్టి రోగప్రారంభమందు అజీర్ణశమనోపాయమును మరియు. విరేచనములు కట్టుబడును పాయమును, చకక్కగ జేయవలయును, మరికొందరికి ఈవిషూచీజాడ్యము భయమువల్లగూడా కలుగుచున్నది. అట్టివారికి యోచించి చికిత్సను జేయవలయును. మరికొందరు మంత్రతంత్రాదికములచే నీరోగము విషూచిరూపముగా సంభవించుచున్నదని వాడుకలోకి దెచ్చియున్నారు. ఈవిచారమునకు మాత్రము మంత్రశాస్త్రము ప్రమాణముగ గనుపడుచున్నది. అయినను, నీవిచారము భక్తి విచారములో జేరియున్నది. లేక, అనుమానాస్పదములో జేరియున్నది. ఇట్టి విచారపరులగు జనులు స్వాభిమానముగల వృత్తులచే బలవంతముగ జనులచే జంపబడుచున్నారు. వారలకు నిదే లాభకరముగనుండుచున్నది. ...

## విషూచిజాడ్యమునకు చికిత్స.

ఇంగువ ౧ మాసములు మిరియాలు ౧ మా, నల్లమందు ౧ మా శుంఠి ౧ మా, వీటిని నిమ్మకాయరసముతో నొక దినము ఖ



ల్వమర్దించి శనగలవలె మాత్రలగు జేసి ప్రకృతిగని పెట్టి వాడిన విషూచీజాడ్యము నివారణంబగును. మరియు, నధికముగ విషూచీజాడ్యమందధిక దాహము సంభవించినయెడల గులాబి అరుకులో నిమ్మకాయరసమును తగుమాత్రముగ జేర్చి మంచినీళ్లను నిచ్చుట కుండులు దీనిని ఇచ్చిన గుణకారిగనుండును. లేక గంధకద్రావకము (అనగా సల్ఫ్యూరిక్ ఆసిడ్) ౩౦ బిందువులను తీరుపావు మంచినుదకములో విడిచి వీటిని సీసానుంచి అధిక దాహమున్నప్పుడు కొద్ది కొద్దిగ నిచ్చిన లాభకరముగనుండును. ...

అనేకౌషధములనిచ్చినను విరేచనములు కట్టుబడనియెడల ౧౦ బిందువులు వౌంటూమూదము దీనిలో కొద్దిగ నల్లపుప్పును జేర్చి యిచ్చిన దీనిచే విషసంబంధముగల మలము పడిపోయిన పిమ్మట దస్తులు కట్టుబడును వప్పుడు రోగికి శ్రమలేకుండునట్లు మంచి స్థలములో నుంచవలయు దుర్వాసనలగుడ్డలను దీసివేసి లఘువుగానుండు పదార్థములను కడుపులోకి నివ్వవలయును. ఉష్ణము నుగలుగంజేయు ఫ్లానల్ వస్త్రములను శరీరమందుంచవలయును, విరేచనములు గలుగంజేయు పదార్థములను నివ్వగూడదు, పొట్టలోనికి సాబూదానాగింజలను అరికాజేసి దీనిలో తగుమాత్రము పాలను జేర్చి యిచ్చిన చాలాగుణకారిగానుండును మరియు, అరారోటుపిండిని పాలతో హరీరాను గాచి నివ్వవలయును. దీనిలో షర్కరను నధికముగ జేర్చక కొద్దిగ వేయవలయును. విరోచనములు కట్టుబడిన పిమ్మట పప్పునుడుకబెట్టిననీటిలో రొట్టెనయినను లేక కిచిడీనయినను జేర్చి లఘువుగను నివ్వవలయును. ఈవ్యాధియందు చాను

బుచ్చుకోగూడదు ❁ ❁

---

## విషూచీజాడ్యమందు సంభవించెడుప్రథమావస్థవిషయమై మాధవనిధానమందు జెప్పంబడినవిధానము.

శ్లో॥ మూర్ఛాతిసారోవమథుఃపిపాసాశూలభ్రమో ద్వేష్టనజృంభదాహాః । వైవర్ణ్యకంపౌహృదయేరుజశ్చ భవంతితస్యాంశిరసశ్చభేదః ॥ ...

తా॥ మూర్ఛ, అతిసారము, వమనము- దాహము. శూలభ్రమ, పిక్కలయందు పీడ- ఆవలింతలు- అంగదాహము, మరియు- దేహకాంతిమారుట- వణుకుట, హృదియందుపీడగలుగుట, తలనొచ్చుట, ఇన్నిలక్షణములతోగూడుకునిన విషూచీజాడ్యమునిగు ర్తెరుంగవలయును ...

దీనిని, ఇంగ్లీషుభాషలో డాక్టరులు మూడుదరిజాలుగా నేర్పాటుజేశియున్నారు. మొదటిదరిజా (డిక్లపమెంట్) అనగా రోగప్రారంభదశా. దీనిచిహ్నావేదనగా, విరేచనములు బహుమారులు అయినప్పుడు, దీనివర్ణము బియ్యపుగంజివలెను- లేక. బియ్యముగడిగిననీళ్ళవలెనునుండును. కాళ్లుచేతులు వీటియందు ఈడుపులుగలుగును. మరియు- ముఖముయొక్క కాంతి శ్యామలవర్ణముగను- నల్లగను, లేక, సీసమువర్ణమువంటివర్ణముగ నుండును- మరియు- ఉదాశీనత్వముగనుండును, మరియు. పీనిగముఖము వంటి ముఖముగలిగియుండును. మరియు, దాహము- ఉష్ణము,



జ్వరిగలిగియుండును. అయినను, దీనిదశాయందు శరీరము చల్లబడకుండానుండును. మరియు. నాడివిశేషముగ మందగతిగనుండదు. ఈఅవస్థవిశేషముగ భయంకరమును గలుగంజేయదు, అయినను ఈదరిజాయందు చికిత్సనుజేయుటకు ఆలస్యముజేయక ప్రకతికిదగినచికిత్సలనుజేశిన ఈవిషూచీజాడ్యము వృద్ధినిజెందక శాంతించును, లేకున్న వ్యాధివృద్ధినిజెందును. ఇట్టిబీమారీని మంచిగాలిదగిలెడు స్థలములోనుంచవలయును, ఇటువంటిరోగిసామీప్యమున అధికజనులుండగూడదు - ఇంటిలోగంధకము పొగవేయవలయును. రోగిని పరుండబెట్టినస్థలములో మంచిగాలి వచ్చుచుండవలయును, రోగిని శ్రమదగులనివ్వకుండా సౌఖ్యదశలో నుంచవలెయును. ...

---

## చికిత్స -

అరగుంజయెత్తుమంచినల్లమందును ప్రాదీనాఅరుకుతో దినిపించినను, లేక, రసభస్మము ౨ గురిగింజలయెత్తు- నల్లమందు ౧ గురిగింజయెత్తు, లేక, ౩ గురిగింజలయెత్తు, వీనిని రెండుమాత్రలనుజేశి- ఈరెంటినినొకమాటుదినిపించినను- విషూచీజాడ్యము నివారించును. వ్యాధిహెచ్చుగానుండినప్పుడు వెంటవెంటమందునునిచ్చుచుండవలయును, తగ్గుముఖముగవ్యాధియుండిన చికిత్సలను నాలస్యముగజేయుచుండవలయును-ఈవ్యాధియందు దాహమునధికముగసంభవించును. కాబట్టి నొకసేరు గులాబీపుష్పముల అరుకులో ౨౦ అలూబుఖారుఫలములనైనను లేక పాతచింతపండునైనను జేర్చి పిశికి, వాడియగట్టి కొద్దిగలవణమునుజేచిి త్రాగించినను లేక, పై

న జెప్పిన గులాబీఅత్తరులోనిమ్మత్తులుసును చేర్చియైనను త్రాగించిన అతిదాహము శాంతించును. లేక, పైన జెప్పియున్నరీతుగ గంధకద్రావకమును జేర్చిన నీటిని త్రాగించినను మిక్కిలిగుణకారిగా నుండును.

మరియు] * కాళ్ళు చేతులయందు ఈడువులుగలిగినప్పుడు శుంఠిని సన్నగనూరి శరీరమునిండా రాచినను, లేక, టర్పెన్టేల్ను శరీరమునకురుద్దినను చాలాఉపయోగముగనుండును;— మరియు- మంచిఆవాలనుమెత్తగనూరి గుడ్డపేటికలకురాచి, పిక్కలకు దండరెట్టలక్రిందిభాగములకు పట్టీలువేసినబహులాభకరముగనుండును, శీతలము హరించును. ఆవాలనూనె ౩ తు- ఆవాలు ౧ తు టర్పెన్టాయిల్ ౧ తు, వీటిని నేకముజేశి శరీరమునకురుద్దినచాలాగుణమిచ్చును- ఈడువులుతగ్గును,— ఈవిషూచీరోగమందు పాలలోఅరారోటుపిండిని తగుమాత్రముజేర్చిచమచీతోత్రాగబట్టుపలచగాఅరీకాగాచికొద్దిగషక్కెరనుజేర్చియైనను, లేకకెంచిల్లవణమును జేచియయినను, అప్పుడప్పుడునిచ్చుచుండవలయును. *

ఇట్లుద్భటారాధ్యవంశసంభవుండగు ముదిగొండమల్లనా
రాధ్యునిచేరచియింపంబడిన విషూచికారోగశమ
నియనుగ్రంథమునందు ప్రథమభాగము,
సమాప్తము,

---

## విషూచీజాడ్యముయొక్క ద్వితీయావస్థావిచారము.

ఈవరిజానుఇంగిలీషులో (కొలైప్సు అనగా క్షీణతా,) యని యందురు, ఇదియొకదరిజాగా నున్నది, యేలననగా- ఈవిషూచీజాడ్యముసంభవించినరోగికి, దుర్బలము, క్షీణత్వము, ఇవిసంభ



వించును, మరియు, శరీరమును స్పృశించితుబెంకవలె నంటుకొనుచుండును, రెండవదరజా సాధారణముగ ముందుసంభవించిన దరిజాకు, ౬- ౭, ఘంటలకుపిమ్మట, రెండవదరిజాఆరంభమగుచుండును- అయినను- నొకానొకప్పుడు ౨౪ ఘంటలవరకు మొదటిదరిజానిలచియుండును, మరియు, నొకానొకప్పుడు ౨- ౪- ఘంటలకుపిమ్మటరెండో దరజా ప్రారంభమగుచుండును- అధికముగ కొన్నివిరేచనములైనపిమ్మట ముఖమునందు అధికముగ గాబరా సంభవించును, మరియు- ముఖము పీనుగుముఖముగనుండును. మరియు, చెమటఅధికముగవెడలుచు రోగిదేహము బెంకవలెనంటుకొనుచుండును. మరియు నాడీమిక్కిలి మందముగ చలించుచుండును, అయినను, రోగికిస్పృహదప్పకుండును, మరియు, అవయవములయందు ఈడువులునధికముగ సంభవించుచుండును, మరియు రోగియొక్కధ్వని మరియొకవిధముగనుండును మరియు, ఉశ్వాసనిశ్వాసములు- నధికముగను,కష్టతరముగనువెడలుచుండును- మూత్రముబంధించును. కంఠధ్వనిగూర్చుండును గొంతుగూర్చుండును. కంటిగుడ్లులోపలికి పీడుచుకొనిబోవును, మరియు, నాలుకను ముట్టుకున్నచల్లగనుండును, దాహమధికముగనుండును. ...

---

## పైనజెప్పంబడినచిహ్నలకుశాస్త్రదృష్టాంతరము,

శ్లో॥ యస్యాన్యమదంతోష్టనఖోల్పసంజ్ఞో । వమ్యర్దితోభ్యంతరయాతనేత్రః । క్షామస్వరస్సర్వవిముక్తసంధి । ర్యాయాన్నరస్సోపునరాగమాయ॥ నిద్రానాశో౽రతిఃకంపో మూత్రాఘాతో విసంజ్ఞితా । అమీఉపద్రవా

ఘోరాః విషూచ్యాః పంచ దారుణాః ॥ ప్రాయేణాహారవైషమ్యా దజీర్ణం జాయతే నృణామ్ । తన్మూలో రోగసంఘాతస్తద్వినాశాద్వినశ్యతే ॥ ...

చికిత్స,

మొదటిప్రకరణములో జెప్పియున్న చికిత్సలను క్రమముదప్పక యుక్తిగనిచ్చిన విషూచీజాడ్యము శమించును నది శమించకుండి అనేక చిహ్నములను గనుపరచుచు శరీరము చల్లబారియుండిన- కొత్త ఆవాలను మెత్తగనూరి ఒట్టకుపమిరి- పొట్టయందంతటను- కాళ్లు చేతులు వీటియొక్క నాడీలమీదను పట్టీలను వేసిన శరీరముష్ణము పారును దీనికన్నను ఈవరిజాయందు వేరొండుచికిత్స నేదియు లేదు. మరియు మొదటిప్రకరణమందు, జెప్పినచికిత్సలనువాడుచుండవలయును. బుద్ధిమంతుడగు వైద్యుడు తనఆలోచనకుదగిన చికిత్సలను జేయుచుండవలయును. ❋

మూత్రముబొత్తిగా రాకుండిన రెండ్లయొక్క సంధులయందు కాపవలయును. మరియు, నడుముమీద పొత్తికడుపున ఆవాలపట్టీలను వేయువలయును- మంచిసోరుప్పు, మరియు, (అసిటేట్ ఆఫ్ పుటాష్)వీటిని ౫ గురిగింజలయెత్తు మొదలుకుని ౧౦ గురిగింజలయెత్తువరకును నైట్రిక్ఈథర్ ౧౦ బిందువులనుంచి మొదలుకొని ౨౦ బిందువులవరకును కర్పూరోదకము (అనగా కేంఫర్ వాటర్) ఇదియొక అవున్సు ఇవిఅన్నిగలిపినొక ఖురాకు ఇట్లుదినానకు ౩, ౫ పర్యాయములు త్రాగించినను- మరియు, వక్షస్థలమును గాపినను- వీటిచే మూత్రము వెడలును. అవయవములయందు ఈడుపులుగలిగినను,



శ్వాసముచక్కగ వెడలకున్నను,- మరియు, శేచ్చైనుగనుండినను- మొదటిప్రకరణమందు జెప్పంబడిన చికిత్సలను జేయవలయును. మరియు, కాళ్ళుచేతులనుచక్కగ నొత్తవలయును. మరియు సాంబరీలవణము- ౨౪ తు, క్యార్బోనేటాఫ్‌సోడా ౧ డ్రామ్, ఉడుకునీళ్లు ౧ పైంటు, వీటిని నేకముజేసి ఆసనములోనికిపిచికారీగొట్టవలయును. ఈచికిత్స డాక్టరీమతములోనిది. మరియు, రోగినిచక్కగా గాలివీచెడు స్థలములోనుంచవలయును. అయినను. రోగి శరీరముమీద గొంగడి లేక రజాయి- మొదలయినవాటినిచక్కగ కప్పవలయును, మరియు, హస్తపాదములనుచక్కగగదిమేస్తూనుండవలయును. మరియు. నొకయిటుకరాయిని చక్కగాకాలిచి బట్టలోచుట్టి అరికాళ్ళను, అరిచేతులను గాపుచుండవలయును. ఈచికిత్స చెమటవెడలుచున్నప్పుడు శరీరముచల్లబారియున్నప్పుడు బహుఉపయోగముగనుండును. అయినను, నేను ఈఅధ్యాయమందు ముఖ్యముగా చికిత్సలను కొన్నిటిని వ్రాసియున్నాను. ఈచికిత్సలను జేయుటనుత్తమముగ నుండును. మరియు- మూడోప్రకరణములోగూడా మొదటిజాడ్యమందు జెప్పంబడినచికిత్సలనే జేయవలయును. నివిముఖ్యముగా రోగనివారణం బౌనన్నను. మరియు, ఈగ్రంథములో జెప్పియున్నచికిత్సలను ముఖ్యముగా గుర్తెరింగియుండవలయును.

ఇట్లుద్భటారాధ్యవంశసంభవుండగు ముదిగొండమల్లనా
రాధ్యునిచేరచియింపంబడిన విషూచికారోగశమ
నియనుగ్రంథమునందు ద్వితీయ భాగము,
సమాప్తము.

## విషూచియొక్క మూత్రోదరిజావర్ణనము.

ఈదశానుఇంగిలీషులో (రీయాక్షన్) అనియందురు. ఈవిషూచీజాడ్యము రెండోదరిజానుండిప్రారంభమై చావునుగలగంజేయకుండినను విశేషముగ ౩, ౪, ఘంటలలోపయినను. లేక, నొకానొకరికి ౧, ౨, దినములపిమ్మట వ్యాధినిర్ముక్తమై రోగిజీవించుటగలదు, మరియు, దినదినము దేహమందు దార్ఢ్యత గలుగుచుండును. మరియు, విషూచీజాడ్యము నివారించినపిమ్మట అపథ్యకారిగనుండిన మరికొన్నివిధములగు వ్యాధులు సంభవించును- మరియు, శరీరమందంతట పట్లుబట్టుటము. జ్వరము- స్మృతిహీనము సన్నిపాతము- ఈమొదలయినవ్యాధులు ముఖ్యముగ సంభవించుచుండును- కాబట్టిమూత్రోదరిజాయందు రోగనివారణమైనను,కొట్టికొద్దిగ విషూచీసంబంధమయిన రోగమునకు జెప్పంబడిన ఔషదాదులను బుచ్చుకొనుచుండవలయును. పిమ్మట నీవిషూచీజాడ్యమునిశ్శేషముగ నయ్యేవరకు ఔషధాదుల నిచ్చుచుండవలయును. మరియు, మూత్రోదరిజాప్రారంభమైనపిమ్మట ౮౦ ఘంటలవరకు వ్యాధి నిర్ముక్తముగ గాకుండినను. అట్టిపురుషుని ముఖవర్చస్సు మారిపోయినను- విరేచనములు గంజివలెను- బియ్యముగడిగిన నీటివలెను. తెల్లగను, ఇట్టిలక్షణములతో నుండకుండినను ౫, ౬, ఘంటలకుపిమ్మట, పావుగుంజయెత్తు నల్లమందు- ౧, గురిగింజయెత్తుకాచు, ఈరెంటినినేకముజేసి- దినిపించిన విరేచనములనుకట్టుబడజేసును, లేక పుల్లదానిమ్మషరుబత్తులో గులాబీఅరుకును జేచి- బుచ్చుకొనిన గుణగారికానుండును- భుజించుటకుసాబూదానా- హారీరాలోపాలనుజేచి నివ్వవలయును- లేక



అరారోటుపిండి అరీరాలోపాలనుజేచి నివ్వవలయును- శరీరమందుదార్ఢ్యతగలుగువరకు పథ్యకారిగ నుండవలయును- లేనియెడల మరియొకవిధమగు వ్యాధి పెంబడించును, మాంసాదులను తినువారలకు- కల్యాములు జవిని- ఇవి లేనిమాంసమును పొదువాడి-చిత్రపారవములో నిచ్చుచుండవలయును- శరీరమందుబలముగలుగువరకు మాంసమును నివ్వకూడదు, వ్యాధినివారించువరకు బహుజాగ్రతతో పథ్యకారిగానుండవలయును, లేకున్న నంజుమొదలయిన రోగములు బుట్టును. విషూచీజాడ్యమందు జ్వరమువచ్చినయెడల విషూచీరోగమునివారించినదని గుర్తెరుంగవలయును, అట్టికాలములో విషూచీ జాడ్యమునకు నిచ్చెడుచికిత్సలను నిలిపిపెట్టి విరేచనకారిగానుండకుండు జ్వరచికిత్సలను జేయవలయును, జ్వరముతగ్గిపోయినపిమ్మట సేయౌషధమును నివ్వకరోగికి పథ్యపూర్వకముగానుంచవలయును, లేక, సన్నిపాతరోగము సంభవించినయెడల అట్టికాలములో శిరస్సు- మరియు, కణతలు, మెడ, వీటిమీద బొబ్బలుబొడుచునౌషధాదులను వేయవలయును- లేకప్లిష్టరును వేయవలయును, లేనియెడల- రోగిబలాబలమును గుర్తెరింగి జలగలను బట్టించవలయును, మూత్రము రాకుండిన, నఘుముమీదఆవాలపట్టినివేయవలయును. పైఅధ్యాయములోజెప్పియున్నమూత్రచికిత్సనుజేసిన మూత్రముధారాళముగావెడలజేయును. గర్భణుందుగుమత్తుముగానుండిన నఘుము అవున్ను అనగా తుంబాపుమంచి వాంటాను దమునునివ్వవలయును. దీనిచే అజీర్ణమునశమించి విరేచనముగును. రోగములయందు రోగులకు ఔషధాదులను నిచ్చుటకు రోగియొక్క-బలాబలములను చక్క-గనెరిం

గి నౌషదాదులనునిచ్చుచుండవలయును. లేక రోగిదుర్బలుడుగ నుండిన నౌషధప్రమాణమును తగ్గించుచుండవలయును. మరియు, వృద్ధులకు ౫౦ సం॥ కధికవయస్సుగలిగియుండిన నౌషధమును తగ్గించుచుండవలయు. మరియు. నెంతవరకువృద్ధవశహెచ్చుగనుండునో నంతవరకు అదేరీతుగ ఔషధప్రమాణము తగ్గించుచుండవలయును- ఏలననగా వృద్ధులయొక్క శక్తి మరియు, ఇంద్రియముల యొక్క బలము వీటినిగనిపెట్టి చికిత్సలను జేయవలయును. ...

## విషూచీ జాడ్యవిషయమై ముఖ్యముగ జేయవలసిన చికిత్సలు.

జిల్లేడువేరు పొట్టును ఛాయయందు శుష్కింపంజేసి, దీనికి సమానము మిరియాలనుజేర్చి, సన్నగ చూర్ణించి, అల్లపురసముచే నొకదినము మర్దించి, శనగలవలె మాత్రలనుజేసి విషూచీజాడ్యము సంభవించినతోడనే నొకటిరెండు మాత్రలను నివ్వవలయును మరియు- విషూచీ జాడ్యమువల్ల దేహ మతిశీతలముగ నుండిన ఘడియఘడియకు నొక్కొక్క మాత్రనునిచ్చుచుండిన శీతలగుణమును నివారించును.

(౨) తెల్లఉల్లిగడ్డనుదంచి రసముదీసి ఘంటకు నొక్కొక్క తులముచొప్పున త్రాగించిన విషూచీజాడ్యము శమించును. ...

(౩) అల్లపురసమును ఘంటఘంటకు నొక్కొక్కతులముచొప్పున త్రాగించిన విషూచీజాడ్యము నివారించును. ...

(౪) యాలకులపొట్టు ౪ మాసములు- వీటినికషాయముగాచి, జిల్లేడుపసుమాత్రలతో బుచ్చుకొనిన విషూచీశమించును. ...



(౫) హారతికర్పూరము- నల్లమందు, కుంకుమపువ్వు, ఇవి నొక్కొక్కమాసము. దాల్చినచెక్క- మంచిసోపుపలుకులు, ఇవి నాలుగేసి మాసములు వీటినన్నిటిని చక్కగచూర్ణించి ఉదకముతో నూరి మిరియాలవలెమాత్రలను జేసి నొక్కొక్కమాత్రనునీళ్ళతో రెండేసిఘంటలకొకసారి దినిపించిన విషూచీజాడ్యము శమించును. ...

(౬) శుంఠి- మిరియాలు- పిప్పళ్ళు, జిలకర, గంధకము, వెల్లిపాయలు- నేతిలోపొంగించిన ఇంగువ- సైంధలవణము, ఇవి నొక్కొక్కతులము,వీటిని ౧౦ తులముల నిమ్మపండ్లరసముతో నది జీర్ణించువరకు చక్కగానూరి జిట్టరేగుగింజలవలె మాత్రలనుజేసి రెండేసి ఘంటలకొకసారి నొక్కొక్కమాత్రనుదినిపించిన విషూచీజాడ్యము శమించును. ...

(౭) జాజికాయను తేనెతోమర్దించి శనగలవలెమాత్రలను జేసి ఘంటఘంటకునొక్కొక్కమాత్రనుబుచ్చుకొనినవిషూచీజాడ్యముశమించును. ...

☞ (౮) విషూచీజాడ్యమందెన్నిచికిత్సలుజేసినను వాంతులు నివారించకుండిన నీచికిత్సలను జేయవలయును. — తామరపలుకులు, ౬ మాసములు- చిన్నయాలకులు, ౨ మా- లవంగములు- ౧ మా- మిశ్రి, ౧ తు, మంచితేనె, ౩ తు. వీటినన్నిటిని నేకముజేసి పూటకు ౬ ౹ మాసములచొప్పున దినిపించిన విషూచీజాడ్యమందు సంభవించినవమనములు నివారించును. ...

దాహమధికముగనుండిన పయిన జెప్పంబడిన పదార్థములను కషాయముబెట్టిబుచ్చుకొనినను దిశమించును. మరియు,రక్తచందనము, పర్పాటకము, వేపచెక్క- ఇవిప్రత్యేకములు ౬ ౹ మాసములు,

(౧౯) లవంగములు ౧౧ - సోపు ౧ తు, వీటిని కషాయము గాచి త్రాగించిన- శిశువులకు గలిగిన విషూచీశమించును. ...

(౨౦) కపూరములు 3 మాసములు, వీటిని నీళ్లలో నూరి వెచ్చజేసి, శిశువులకు త్రాగించిన విషూచీశమించును. ...

(౨౧) జాజికాయ ౧ మాసము, యాలకులు ౭ మా- లవంగములు ౪. వీటిని సన్నగనూరి తగుమాత్రము తేనెలో నాకించిన శిశువులకుగలిగిన విషూచీశమించును. ఈ యౌషధము నే కొద్దికు నధికముగనివ్వవలయును. ...

ఇట్లు శ్రీమదారాధ్యవంశసంభవుండగు ముడిగొండ మల్లనారాధ్యునిచేరచియింపంబడిన విషూచికారోగశమని యనుగ్రంథమునందు తృతీయ భాగము,

సమాప్తము.

—*(విషూచికారోగ వర్ణనము-)*—

* అనగా కల్తర, మారీ ఉపద్రవము. *

సర్వజనులు చక్కగ దెలుసుకోదగిన దేదనగా, ఈ మారీఉపద్రవమునకు శాస్త్రమందు విషూచికారోగమని నామమిడియున్నారు. !— విశేషముగ విషస్వభావమును జెందియుండు- గావున, ఇది చెడిపోయిన ఉదకమునుండి, మరియు, మురుగుడజూచిన పదార్థములనుండి బుట్టుచున్నది, మరియు, నిది ఇటువంటి రోగముగదా మనుజులకుదగిలి తక్షణమే మృతినిజెందించును....

మరియు * నానా విధములగు విరేచనములను, వాంతులను తక్షణమే బుట్టించును. వాస్తవముగ నీవిషూచీరోగము మహాభ



యంకరమైన యుపద్రవములను బుట్టించుటకు కాలమృత్యుస్వరూపముగనున్నది. మరియు నెక్కడనీవ్యాధిసంభవించుచున్నదో నక్కడ గ్రామములను పల్లెలను నాశనముజేయుచున్నది. కాబట్టి సర్వజనులు ఇట్టియుపద్రవము బట్టకుండునటుల గ్రామమును, మరియు- గృహములను- జలమును. బుచ్చుకొనుపదార్థములను- శరీరములను, ఈమొదలయినవాటిని పరిశుభ్రముగనుండునటుల జేసుకొనవలయును। ఇటువంటివాటిని చక్కగశుద్ధిబరుచుకొనిన ఈవిషూచీబాధ విశేషముగదగలకుండానుండును. నీరోగము అధికదుఃఖమునకు కారణభూతముగనున్నది. మరియు- నీవ్యాధిసంభవించినతక్షణమే నేమియుపాయము జేయవలయునో నేమిభుజించవలయునో మరియు- నేవివ్యాధినివృత్తి జెందించునో మరియు- నేచికిత్సదీనికి నుపయోగముగనుండునో వాటిని చక్కగవిచారించి శాస్త్రమార్గముగ చికిత్సలను జేయవలయును. లేకున్న అజ్ఞానదశచే కాలగ్రస్తులగుదురు- చక్కగ ఈవిచారమును నెరింగి శాస్త్రమార్గముగ సంచరించినవారలను నిట్టియుపద్రవము విశేషముగ బాధపెట్టకుండును. కాబట్టి నేను ఈగ్రంథమందు యెల్లరకు చేటగ దెలియునటుల శాస్త్రమునుండి నెత్తి వ్రాసినాడ- మరియు, నీగ్రంథమును చక్కగజదివిన- డాక్టరీసంబంధమయిన విచారము యూనానీవిచారము- శాస్త్రవిచారము. ఇవిచక్కగబోధపడును. మరియు, దీనిని జూచి ప్రసంగించినజనులు నెప్పటికి కొట్టుబడరు. కాబట్టి తమతమప్రాణసంరక్షణార్థమై జనులుకృషిజేసినవారలకు వారికనుకూలులయినవారలకు సౌఖ్యాతరముగనుండును. పరమేశ్వరుడయినవాడొక డురక్షకుడుండగానిర్భయులుగనుండు రాజాధిరాజులు ఈవిషూచీజాడ్యము పేరువినినమాత్రమున స్వదేశమువిడచి పరదేశమున

కుదారిపోవుదురు. ఎంత ధైర్యముగలవాడయినను ఎంతశూరుడయినను, ఈవార్త విన్న మాత్రమున నెవరికి జెప్పక పారిపోవును. మరియు. సామాన్యులు, భయస్థులు, వీరివిచారము జెప్పనేల మరియు, అతిక్లిష్టము యేయే స్థలములలో విశేషముగనుండునో ఆయాస్థలములలో మారీఉపద్రవములు మెండుగనుండును. ...

మరియు, విశేషముగ జనులునేస్థలమునందు గుమిగూడియుండెదరో అటువంటి స్థలములో విషూచికోపద్రవము సంభవించుచుండు. కాబట్టి యోగ్యులయినవారలు తాము భుజింపబడు పదార్థములయందును, నివసించియుండెడు గృహములయందును, ఉదకమందును, వీటియందు సంపూర్ణముగ దృష్టియుంచి అనుభవములోకి దెచ్చుకొనుచుండిన నట్టిస్థలములలో విషూచికోపద్రవములు మెండుగనుండకుండు. ...



ఇట్లుద్భటారాధ్య వంశసంభవుండగు ముదిగొండమల్లనా
రాధ్యునిచే రచియింపంబడిన విషూచికారోగశ
మనియనుగ్రంథమునందు చతుర్థభాగము
సంపూర్ణము.



